# మణికట్టు గొలుసు



యొషికో ఉచిదా

“దీనిని ఎప్పుడూ నా చేతికే ఉంచుకుంటాను," తన ప్రాణ స్నేహితురాలు లారీ మాడిసన్ వీడ్కోలు బహుమతిగా ఇచ్చిన బంగారం రంగులో హృదయమున్న గొలుసును చేతికి తొడుగుకుంటూ ఎమీ మాట ఇచ్చింది. జపనీస్-అమెరికన్లనందరిని తరలిస్తున్న “నిర్బంధ శిబిరాని"కి ఎమీని, ఆమె కుటుంబాన్ని కూడా తరలిస్తున్నారు. అది 1942వ సంవత్సరం. జపాన్ – అమెరికాల మధ్య యుద్ధం జరుగుతోంది.

ఏడు సంవత్సరాల ఎమీకి తన స్నేహితులను, తన బడిని, తమ ఇంటిని వదిలి వెళ్లాలని లేదు. తాము జపనీస్-అమెరికన్లు అయినందున తమకు మరొక దారి లేదని అమ్మ చెప్పింది. అమ్మ కోసం ఎమీ తన దుఃఖాన్ని వ్యక్త పరచకుండా ఉంది. అయితే, శిబిరంలో మొదటి రోజే ఆమె తన స్నేహితురాలు ఇచ్చిన మణికట్టు గొలుసును పోగొట్టుకుంది. అప్పుడు ఆమెకు ఏడవాలని అనిపించింది. “నా ప్రాణ స్నేహితురాలిని ఎలా గుర్తుంచుకోవాలి?" అని తనని తాను ప్రశ్నించుకుంది.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో జపనీస్-అమెరికన్‌గా తన బాల్యాన్ని ఆధారంగా చేసుకుని జ్ఞాపకాల శక్తిని గుర్తించిన ఒక బాలిక కథను యొషికా ఉచిదా హృదయానికి హత్తుకునేలా చెప్పారు.

తాను ఏడవటం అక్క చూడటం ఎమీకి ఇష్టం లేదు. ఆమె చప్పున తన కన్నీళ్లను తుడిచేసుకుంది, కానీ ముఖంలోని విచారాన్ని తుడిచెయ్య లేకపోయింది.

“మనం బయలుదేరే సమయం అవుతోంది," వాళ్ల అమ్మ చెప్పింది.

కొంతసేపటిలో ఆ ఇల్లు వదిలిపెట్టి వెళ్లాలని ఎమీకి తెలుసు.

ఆమె తన గదిని కలయ చూసింది. మిగిలిన ఇల్లు లాగా అది కూడా ఖాళీగా ఉంది. బహుమతి లేని బహుమతి పెట్టె లాగా ఆ గదిలో శూన్యం నిండి ఉంది.

ఎమీ కళ్లు మూసుకుని ఒకప్పుడు ఆ గది ఎలా ఉండేదో ఊహించుకుంది. కిటికీలకు పూల కర్టెన్లు ఉండేవి, తన బట్టలు గదంతా చిందరవందరగా పడి ఉండేవి, తనకి ఇష్టమైన గుడ్డ బొమ్మ, టెడ్డీ బేర్ బల్ల మీద ఉండేవి.

కళ్లు మూసుకుని, మనసులో దాచుకున్న దృశ్యాల ఆధారంగా మొత్తం ఇల్లు ఎలా ఉండేదో గుర్తు తెచ్చుకుంది.

ఎమీ, ఆమె కుటుంబం కావాలని ఇల్లు వదిలి పెట్టటం లేదు. వాళ్లు జపనీస్-అమెరికన్లు అయినందున ప్రభుత్వం వాళ్లను బలవంతంగా నిర్బంధ శిబిరాలకు తరలిస్తోంది. జపానుతో అమెరికా యుద్ధం చేస్తుండటమే దానికి కారణం.

వాళ్లు ఏ తప్పూ చెయ్యలేదు. శత్రువు లాగా ఉన్నందుకు తమను కూడా శత్రువులుగా చూస్తున్నారు. జపనీస్ కంపెనీకి పని చేస్తున్నాడన్న కారణంగా నాన్నని ఎఫ్‌బిఐ (అమెరికా గూఢాచారి సంస్థ) యుద్ధ ఖైదీల శిబిరానికి పంపించింది.

అదంతా అయోమయంగా ఉందనుకుంది ఎమీ. వాళ్లు అమెరికాని ప్రేమిస్తున్నారు, కానీ అమెరికా వాళ్లని తిరిగి ప్రేమించటం లేదు. అంతే కాదు, వాళ్లని నమ్మటం కూడా లేదు.



బెల్లు మోగటంతో ఎమీ తలుపు వైపుకి పరిగెత్తింది. పొడవుగా ఉండి, యూనిఫాం వేసుకున్న ప్రభుత్వ వార్తాహరుడు వచ్చాడని ఆశించిందేమో. ఎక్కడో పొరపాటు జరిగింది, వాళ్లు శిబిరానికి వెళ్లవలసిన అవసరం లేదని అతడు చెబుతాడని ఆశించిందేమో.



అయితే, తలుపు తెరిచిన ఎమీకి ఆ వచ్చింది వార్తాహరుడు కాదని తెలిసింది. తనతో పాటు రెండవ గ్రేడ్ చదువుతున్న తన ప్రాణ స్నేహితురాలు లారీ మాడిసన్ వచ్చింది.

ఎమీతో కలిసి బడికి వెళ్లటానికి లారీ రాలేదు. ఆమెతో రోలర్ స్కేటింగ్ చెయ్యటానికి కూడా రాలేదు. ఆమె తన కొత్త బట్టలు చూపించటానికి రాలేదు, తనతో పాటు దుకాణానికి రమ్మని పిలవటానికి కూడా రాలేదు. ఎమీ పుట్టిన రోజుకి వచ్చినట్టు ఆమె కోసం లారీ ఒక బహుమతి తీసుకుని వచ్చింది. అయితే ఆమె పార్టీకి వేసుకుని వచ్చే బట్టలు వేసుకుని రాలేదు. ఎమీ లాగానే ఆమె ముఖంలో కూడా విచారం ఉంది.

“ఇదిగో," బహుమతి ఇస్తూ లారీ అంది. “ఇది చేతి గొలుసు. నా గుర్తుగా నీతో పాటు శిబిరానికి తీసుకుని వెళ్లు."



సన్నటి ఆ గొలుసుకి హృదయాకారపు బిళ్ల ఒకటి ఉంది. దానిని పెట్టుకోవటంలో ఏమీకి లారీ సహాయపడింది. అది ఏమీకి ఎంతో నచ్చింది.

“ఈ గొలుసుని ఎప్పుడూ నా చేతికి ఉంచుకుంటాను," ఏమీ మాట ఇచ్చింది. “స్నానం చేసేటప్పుడు కూడా తియ్యను."

ఏమీని లారీ హత్తుకుంది. “సరే. కానీ, నువ్వు తొందరగా తిరిగి రావాలి," లారీ అంది.

“అలాగే," ఏమీ బదులిచ్చింది. కానీ ఎప్పటికైనా తిరిగి వస్తుందో లేదో ఆమెకి తెలియదు. మళ్లీ లారీని కలుసుకోకపోవచ్చు కూడా.

వెనక్కి తిరిగి చూస్తూ, చేతులు ఊపుతూ వెళ్లిపోతూ ఉన్న లారీని ఆమె చూస్తూ ఉండింది.

ఆ దృశ్యాన్ని ఇక చూడలేక ఏమీ దఢేలున తలుపు మూసివేసింది.





బెల్లు మళ్లీ మోగింది. ఈసారి పక్కన ఉండే మిసెస్ సింప్సన్ వచ్చింది. జపనీస్-అమెరికన్లు అందరూ హాజరు కావలసిన కేంద్రానికి వాళ్లని తీసుకుని వెళ్లటానికి ఆమె వచ్చింది.

“నీ సామాన్లు అన్నీ తీసుకుని పద, ఎమీ," అక్క రీకో అంది. “మనం బయలుదేరే సమయం అయ్యింది."

తన చేతికి గొలుసు ఉందో లేదో ఎమీ మరొకసారి చూసుకుంది. ఒక్కొక్కరూ రెండు సూట్‌కేసులు మాత్రమే తీసుకుని వెళ్లవచ్చు. అవి నిండిపోయాయి కాబట్టి ఆమె తన స్వెట్టరు, ఓవరుకోటు రెండూ వేసుకుంది. ప్రతి కుటుంబానికీ ఇప్పుడు ఒక ప్రత్యేక నంబరు ఉంది. ఎమీ తన రెండు సూట్‌కేసుల మీదా 13453 అన్న నంబరు వేసింది.

గది, గదికీ తిరుగుతూ ఆఖరిసారిగా ఇంటి మొత్తాన్ని చూసింది అమ్మ. ఆమె వెనకాలే ఎమీ కూడా తిరుగుతూ సామాన్లు, బొమ్మలు, పుస్తకాలతో ఉన్నప్పుడు ఆ గదులు ఎలా ఉండేవో ఊహించుకుంటోంది.

నాన్నకి ఎంతో ఇష్టమైన తోటని ఆఖరిసారి చూడటానికి వాళ్లు బయటకు వెళ్లారు. నాన్నే ఉండి ఉంటే అందమైన కార్నేషన్ పువ్వును తెంపి లోపలికి తెచ్చి, “అమ్మీ, ఇది నీ కోసం," అని ఉండేవారని ఎమీకి తెలుసు. అమ్మ నవ్వి, దానిని తన క్రిస్టల్ పూల పాత్రలో ఉంచేది.

కానీ ఇప్పుడు తోట ఎండిపోయి ఖాళీగా కనపడుతోంది. నాన్న లేడు, అమ్మకి తోట పని చేసేటంత సమయం లేదు. ఎమీకి లాగా ఆ తోటకి కూడా ఒంటరిగా, పరిత్యజింపబడినదానిలా అనిపిస్తూ ఉండవచ్చు.



కేంద్రానికి చేరుకునేసరికి ఎమీకి అక్కడ వందలాది జపనీస్-అమెరికన్లు కనిపించారు – అమ్మమ్మలూ, తాతయ్యలూ; అమ్మలూ, నాన్నలూ; పిల్లలూ. అందరి చేతుల్లో నంబర్లు ఉన్న మూటలు, సూట్‌కేసులూ ఉన్నాయి. కొంతమంది ఏడుస్తున్నారు, కానీ చాలామంది మౌనంగా ఉన్నారు. ఎమీకి పొట్టలో చుట్టేసినట్టుగా ఉంది. అందరూ తన లాగే భయపడుతూ ఉన్నారా? చేతి గొలుసుకి ఉన్న గుండె బొమ్మను తడిమి ధైర్యం కూడగట్టుకోటానికి ప్రయత్నించింది.

బాయ్‌నెట్లు ఉన్న తుపాకులతో ప్రతి తలుపు దగ్గర ఉన్న సైనికులను చూసిన ఎమీ మోకాళ్లు వణికిపోయేటంతగా భయపడింది. "ఎవరైనా పారిపోటానికి ప్రయత్నిస్తే వాళ్లని కాల్చేస్తారా?" ఆమె తన అక్కని అడిగింది. "ఏమో, నాకు తెలియదు," రీకో గంభీరంగా బదులు ఇచ్చింది.




వరసగా నిలిపి ఉన్న బస్సులలోకి అందరూ ఎక్కే సమయం అంతలోనే వచ్చింది. కారాగార శిబిరంగా మార్చిన "తాన్‌ఫోరన్ రేస్-ట్రాక్స్‌కి" వాళ్లని తీసుకుని వెళుతున్నారు.

బాగా తెలిసిన వీధుల గుండా బస్సు వెళుతుంటే ఎమీ కిటికీలోంచి బయటకు చూస్తూనే ఉంది. అమ్మ సోయా పెరుగు, ముల్లంగి పచ్చళ్లు కొనే కాటో కిరాణా దుకాణాన్ని బస్సు దాటింది.

దాని కిటికీలకు ఇప్పుడు చెక్కలు కొట్టేసి ఉన్నాయి. తలుపుకి ఇంకా వేలాడుతున్న ఒక బోర్డుని ఎమీ చూసింది. దాని మీద "మేం దేశభక్తిగల అమెరికెన్లం" అని రాసి ఉంది.

నేను కూడా అనుకుంది ఎమీ. మేమందరం దేశభక్తి కలిగిన వాళ్లమే. కానీ సైన్యమే అలా భావించటం లేదు.

వాళ్ల బస్సు ద్ర తీరాన వేగంగా వెళుతూ, ఎండలో వెండిలాగా మెరుస్తున్న బే వంతెనను దాటేసింది.

“బై, వంతెన," ఎమీ గుసగుసగా అంది. “గుడ్-బై సాన్‌ఫ్రాన్సిస్కో సముద్ర తీరమా. గుడ్-బై గౌరు కాకుల్లారా."

తన పక్కన కూర్చున్న అక్కకేసి ఎమీ చూసింది. ఆమె ఏడవకుండా ఉండటానికి విశ్వప్రయత్నం చేస్తోందని స్పష్టంగా తెలుస్తూ ఉంది.

“పిచ్చి సైనికులు!" రీకో గొణుగుతోంది. “పిచ్చి యుద్ధం!"

అంతలోనే వాళ్లు తాన్‌ఫోరన్ రేస్-ట్రాక్స్‌కి చేరుకున్నారు. దాని చుట్టూ ముళ్ల కంచె వేసి ఉంది. ప్రతి మూలలో కాపలాకి వేసిన మంచెలు ఉన్నాయి. బస్సులు లోపలికి వెళ్లటానికి సైనికులు తలుపులు తీశారు. ఆ వెంటనే ఎవరూ బయటకి వెళ్లకుండా తలుపులు వేసేశారు. ఇప్పుడు వాళ్లంతా లోపల బందీలు.



వాళ్లకి 16వ బ్యారాక్‌లో 40వ ఇల్లు ఇచ్చారు.
దానిని వెదకటంలో నాన్న స్నేహితుడు మిస్టర్ నోమా సహాయపడ్డారు.
రేస్-ట్రాక్ లోపల ఇళ్లు ఏమీ లేవు. నిజానికి అక్కడ సైనికులు ఉండే బ్యారాక్‌లు కూడా లేవు.
అది గుర్రపు శాలల వరస. ఒక్కొక్క శాలకి ఒక నంబరు ఇచ్చారు.
40 సంఖ్య ఉన్న శాలకి చేరుకోగానే, "మీరు ఉండబోయేది ఇక్కడే. ఇదే మీ ఇల్లు," మిస్టర్ నోమా చెప్పారు.
ఎమీ, రీకో లోపలికి తొంగి చూశారు. "బాబోయ్! ఇది చాలా మురికిగా ఉంది!"
దానిని ఎవరు ఏమని పిలిచినా అది మాత్రం చీకటిగా, మురికిగా ఉన్న, ఇప్పటికీ గుర్రాల వాసన వస్తున్న ఒక గుర్రపు శాల. ఆ మురికి మీదే లినోలియం పట్టా వేసి ఉంది. దాని మీద చిత్రిపట్టిన పొట్టు, మేకులు, దుమ్ము, చచ్చిపోయిన పురుగులు ఉన్నాయి. అందులో సైనికులు ఉపయోగించే మూడు మడత మంచాలు తప్పించి ఇంకా ఏమీ లేవు.
పిల్లలని ఉత్సాహ పరచటానికి, "కిటికీ తెరలకి గుడ్డ పంపించమని మిసెస్ సింప్సన్‌కి చెపుతాను. అవి అమర్చిన తరవాత ఈ గది బాగుంటుంది," అంది అమ్మ. కానీ అమ్మకి కూడా లోపల లోపల తమ లాగే అనిపిస్తోందని ఎమీకి తెలుసు. అయితే ఆ క్షణంలో ఇంకేమి మాట్లాడాలో ఎవరికీ తోచలేదు.
ఎమీ వాళ్ల అమ్మ ఏడిస్తే చూడటం ఇష్టం లేని మిస్టర్ నోమా, "నేను తొందరగా వెళ్లి పరుపులు తీసుకుని వస్తాను. లేకపోతే అవి అయిపోతాయి," అంటూ అక్కడినుంచి హడావిడిగా వెళ్లిపోయాడు.
అయితే అమ్మ ఏడవలేదు. పక్కనుంచి ఒక చీపిరి తీసుకుని వచ్చి దుమ్ము, పురుగులు అన్నింటినీ ఊడ్చేసింది.



ఎమీ, రీకో మంచాలు వేసిన తరవాత ఎమీ ఆ విషయాన్ని గమనించింది.
"నా చేతి గొలుసు లేదు!" ఎమీ అరిచింది. "దానిని నేను పోగొట్టుకున్నాను!"
ఆ గది అన్ని మూలలా, బయటా ఎమీ వెదికింది. అమ్మ, రీకోలు కూడా దానిని వెదకటానికి సహాయం చేశారు. ఎంత వెదికినా చేతి గొలుసు దొరకలేదు.

చీకటి పడుతోంది. అమ్మ తన టార్చిలైట్ తీసింది. వాళ్లు అక్కడికి వచ్చిన దారిలో వెనక్కి వెళ్లి అణువణువూ గాలించారు. క్రితం రాత్రి కురిసిన వానకి ఆ ప్రదేశమంతా బురదగా, నీటి మడుగులతో ఉంది. వాళ్లు ఎంత వెదికినా ఎమీ చేతి గొలుసు దొరకలేదు.



ఆపాటికి గ్రాండ్‌స్టాండ్ వద్ద రాత్రి భోజనాల సమయం అయ్యింది. చేతిలో పళ్లెం, ఫోర్క్ పట్టుకుని ఉన్న పొడవాటి వరస చివరన అమ్మ, రీకోలతో ఎమీ నిలబడి ఉంది.

అయితే ఎమీ తన చేతి గొలుసు గురించే ఆలోచిస్తూ ఉంది. తన ప్రాణ స్నేహితురాలిని  గుర్తు పెట్టుకునే ఏకైక వస్తువుని ఆమె పోగొట్టుకుంది. ఎమీకి ఏడవాలని అనిపిస్తోంది.



మరునాడు తన సూట్‌కేస్ తీసిన ఎమీకి అందులో తనకి ఇష్టమైన ఎర్ర స్వెట్టరు కనిపించింది. లారీ, తాను బడికి మొదటి రోజున ఒకే రకమైన ఎర్ర స్వెట్టరు వేసుకున్న సంగతి ఆమెకి గుర్తుకు వచ్చింది. ఇద్దరికీ ఒకే రకమైన లంచ్ బాక్సులు కూడా ఉండేవి.

బడి అయిపోయిన వెంటనే ఇంటి దగ్గర ఖాళీ ప్రదేశంలో ఇద్దరూ కలిసి గాలిపటాలు ఎగరవేసేవాళ్ళు. గాలికి నాట్యం చేస్తున్న వాళ్ల ఎరుపు, పసుపు పచ్చ గాలిపటాలు ఎమీకి కనపడుతున్నాయి.

బెర్కిలీలోని తమ ఇంటిలోని ప్రతి గదీ ఆమె మనసులో ఎప్పటికీ గుర్తుండిపోయినట్టే ఆ క్షణంలో లారీని తన మనసులో గుర్తుచేసుకుంటోందని ఎమీ గ్రహించింది. లారీని గుర్తు చేసుకోటానికి ఆమె ఇచ్చిన చేతి గొలుసు ఉండనవసరం లేదని కూడా ఎమీ గ్రహించింది.



వాళ్లకి కొన్ని అరలు చేసిపెట్టటానికి మిస్టర్ నోమా వచ్చారు. పనికిరాకుండా ఉన్న కొన్ని కలప చెక్కలతో ఒక టేబులు, ఒక బెంచి కూడా చేసి పెట్టారు.

అర మీద నాన్న ఫొటో పెట్టటం అమ్మ చేసిన మొట్టమొదటి పని. కానీ, నాన్నని గుర్తుచేసుకోటానికి ఆమెకి నాన్న ఫొటో అవసరం లేదని ఎమీకి తెలుసు.

అమ్మ మనసులో కూడా అదే ఆలోచన మెదిలినట్టు ఉంది. “లారీని గుర్తు చేసుకోటానికి చేతి గొలుసు అవసరం లేదని నీకు తెలుసు. అలాగే నాన్నని కానీ, మనం ప్రేమించి, వదిలిపెట్టి వచ్చిన ఇంటిని, వస్తువులను, స్నేహితులందరినీ గుర్తు చేసుకోటానికి ఎటువంటి ఫొటోలు అవసరం లేదు. అవన్నీ మన హృదయాలలోనే ఉంటాయి, మనల్ని ఎక్కడికి పంపించినా వాటిని మనతో తీసుకుని వెళతాం."



అమ్మ చెప్పిన మాటలు నిజమని ఎమీకి తెలుసు. త్వరలోనే వాళ్లని ఉటా ఎడారిలోని శిబిరానికి పంపిస్తారు. కానీ అప్పుడు కూడా లారీ తన స్నేహితురాలే. లారీని ఎప్పటికీ మరిచిపోదని ఎమీకి తెలుసు.



## రచయిత్రి మాటలు



రెండవ ప్రపంచ యుద్ధం మొదలైన కొంత కాలానికి 1942లో అమెరికా ఆ దేశ పశ్చిమ తీరంలోని 1,20,000 జపనీస్-అమెరికన్లను వాళ్ల ఇళ్లను ఖాళీ చేయించి, బందీలుగా చేసింది. వాళ్లల్లో మూడింట రెండు వంతుల మంది అమెరికా పౌరులు. వీళ్లు ఏ తప్పూ చెయ్యలేదు, ఏ చట్టాలను ఉల్లంఘించలేదు. అయినా ఎటువంటి విచారణ లేకుండా ముందుగా వాళ్లని రేస్-ట్రాక్‌లలో, ఆట మైదానాలలో నిర్బంధించారు. ఆ తరవాత దేశంలోని మారుమూల ప్రాంతాలలోని, చెట్టూ చేమా లేని పది నిర్బంధ శిబిరాలకు తరలించారు.

"ఆనాడు వాళ్లను ఇళ్లు ఖాళీ చేయించి, నిర్బంధించటం తప్పే. జపనీస్-అమెరికన్లు ఆనాడు, ఈనాడు దేశభక్తిగల వాళ్లే," అని 1976లో దేశ అధ్యక్షుడు జెరాల్డ్ ఆర్. ఫోర్డ్ ప్రకటించాడు.

అధ్యక్షుడు జిమ్మీ కార్టర్ ఏర్పాటు చేసిన కమిషన్, అమెరికా కాంగ్రెస్ లోతుగా విచారణ జరిపి జపనీస్-అమెరికన్లకు తీరని అన్యాయం జరిగిందని 1982లో ప్రకటించాయి. జాతి వివక్షత, యుద్ధ ఉన్మాదాల కారణంగా, రాజకీయ నాయకత్వ వైఫల్యం వల్ల ఇలా జరిగిందని అవి పేర్కొన్నాయి.

వాళ్లని అన్యాయంగా నిర్బంధించటాన్ని ఆ తరవాత ఆరు సంవత్సరాలకు అమెరికా ప్రభుత్వం అధికారికంగా అంగీకరించి, క్షమాపణ చెప్పింది. ఆనాడు జపాను మూలాలు ఉన్న అమెరికన్ల పౌర హక్కులను హరించటాన్ని సరిచెయ్యటానికి ప్రతీకాత్మకంగా వాటిని పునరుద్ధరించింది.

## అయిపోయింది